

# కవి పరిచయము

పేరు : కలవకొలను సూర్యనారాయణ

జననం : 16-10-35

విద్య ; బి.ఎ.,

ఉద్యోగం : జిల్లా పంచాయితీ ఆఫీసులో సూపరింటెండెంటుగా పనిచేసి పదవీ విరమణ చేశారు.

అభిరుచి : ఇంగ్లీషు వార్తా పత్రికలలో '*Letters*' వ్రాయడం కవిత్వం

ముద్రిత రచనలు : 1) సాయినాథ సుధామాధురి 2) సీత 3) శ్రీనివాస కళ్యాణము 4) భావవీణ

అముద్రితము : సత్య సందర్శనం (శతకము)

# శ్రీనివాస కల్యాణము







రచయిత
కలవకొలను సూర్యనారాయణ, B. A.,

ప్రథమ ముద్రణ : 1999

ప్రతులు : 500



వెల : అమూల్యము

ప్రతులు లభించుచోటు :

కలవకొలను సూర్యనారాయణ
ప్లాటు నెం. 58
సీతారామ్‌నగర్ యన్.జి.ఓ. కాలని
శ్యామలానగరు వెనుక
గుంటూరు-6

ముద్రణ :

శ్రీ ద్వారకాసాయి ప్రింటర్స్, ఏ. టి. అగ్రహారం, గుంటూరు.

# శుభకామన

ఈ గ్రంథకర్త అయిన శ్రీ కలవకొలను సూర్యనారాయణగారు మావలెనే "ప్రవృత్తి" విషయములో సమానధర్మి. మా వృత్తులు వే అయినను, అందఱమూ సాహిత్యాభిమానులము గాన, ఆ బాదరాయణ సంబంధమే మాచేత ఈ గ్రంథముగూర్చి రెండుమాటలు వ్రాయించినది.

ప్రార్థనా పద్యములు గాక, మొత్తము 7) పద్యములుగల చిఱుకబ్బమిది. ఈ కవికి 'ఉత్పలమాల' అన్నచో మక్కువఎక్కువ కాబోలు-దాని ఫలితమే దీనిలో మొత్తము ముప్పటిమూడు "ఉత్పలమాలల" గుబాళింపు ఉన్నది.

నాల్గవ పుటయందు శ్రీదేవి పట్టుదలను వర్ణించు పట్టున "పట్టుదలయందు, పడతులెగట్టివారు" అని, చక్కని లోకోక్తిని, నగ్నసత్యమును, సహజసుందరములగు తేట తెనుగు మాటలలో చెప్పినారు.

కొంచెము "అవాల్మీక" మైనను, ఇందురావణుడు ఎత్తుకపోయిన ఆమె సీత కాదనియు, సీతరూపమున నున్న వేదవతియని, చక్కగా కల్పన చేసినారు. తదుపరి, వేదవతియే పద్మావతి రూపమున జన్మించెనని చెప్పినారు. కల్పన సముచితముగనే యున్నది.

ఇఱువదినాల్గవపుటలో- " శ్రీనివాసుడే యర్థించె సిరిని నాడు" అనిచెప్పి, ఎంతటి ఆగర్భ శ్రీమంతున కయినను. ఒక్కొకయపుడు ఇతరుల యొద్ద అర్థిక సాహాయ్యము అవసరమగు చుండునని చక్కగా చెప్పినారు.

కావ్యము పేరు "శ్రీనివాస కళ్యాణ" మగుటచే కాబోలు, కవి, వధూవరులను పెండ్లికిముందు అలంకరించు సమయమున పద్మావతి అలంకారమున కంటె, శ్రీనివాసుని యలంకారమునకే ఎక్కువప్రాధాన్యము నొసగెను.

మొత్తముమీద ఈ గ్రంథము అనవద్యముగ, సరళముగ, సహజముగ, సుందరముగనుండి, సామాన్య పాఠకులకు సహితము సుబోధకముగనున్నది.

ఇట్టి గ్రంథముల నితోధికముగ భావికాలములో వ్రాయుటకు వీరికి, ఆ "శేషగిరి" వాసుడగు "సర్వేశ్వరుడు" శక్తినొసంగుగాత.

ఇతిశం.

ఇట్లు

రాజమహేంద్రవరము
3-7-99

శేషగిరి-సర్వేశ్వరకవులు
(సత్యవోలు శేషగిరిరావు &
వంగపండు సర్వేశ్వరరావు)

# నివేదన

నేను అమరావతి హైస్కూలులో చదువుకునే రోజులలో తెలుగు బోధించుటకు శ్రీ మహావాది వేంకట రత్నంగారు, శ్రీ వావిలాల నరశింహారావు గారు, హిందీ బోధించుటకు, శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు, (కరుణశ్రీ) వచ్చేవారు మొట్ట మొదటి సారిగా శ్రీ మహావాది వేంకటరత్నంగారు మా క్లాసు విద్యార్థులకు ఛందస్సు చెప్పారు. ఆకాలంలో కరుణశ్రీగారి పద్యాలు ఘంటసాలవారి గళం నుండి విస్తృతంగా వినిపిస్తూ ఉండేవి. అది విన్న తరువాత పద్యాలు వ్రాయాలని నాకు సంకల్పం కలిగింది. అప్పుడప్పుడు కొన్ని వ్రాశానుకాని అవి చిత్తుకాగితాల బుట్టలోకి పోయాయి. చదువు పూర్తి అయిన తరువాత, ఉద్యోగం. పద్యాల మీద ధ్యాసపోలేదు. పదవీ విరమణ చేసిన తరువాత మరల పద్యాలు వ్రాయాలని కుతూహలం కలిగింది. కాని నేను తెలుగులో పండితుడనుకాను, ప్రావీణ్యమూలేదు. ఏదో సాధారణ భాషా జ్ఞానం కలవాడిని మాత్రమే. వారు వీరు వ్రాసిన పద్యాలు, కొన్ని పద్యకావ్యాలు చదువుట వలన కొంత పరిజ్ఞానం సంతరించు కొని మొదటిసారిగా శ్రీ సాయినాథ సుధామాధురి. తరువాత సీత, శ్రీనివాస కల్యాణము, భావవీణ, సత్యసందర్శనం అను పద్య కావ్య ములను శ్రీసాయినాధుని అనుగ్రహం వలన వ్రాయగలిగితిని. నాకవితా వ్యాసంగములో అండగా నిలిచి నా కవితకు వన్నెలు దిద్దిన శ్రీ *J. J. K.* బాపూజీ గారికి, రాజమండ్రి వాస్తవ్యులు మరియు మాజీ గుంటూరు జిల్లా పంచాయితీ ఆఫీసరు శ్రీ వంగపండు సర్వేశ్వరరావు గారికి మరియు శ్రీ సత్యవోలు శేషగిరిరావు (వీరు

గూడ రాజమండ్రి వాస్తవ్యులే) గారికి నా హృదయ పూర్వక నమస్సుమాంజలుల నర్పించుచున్నాను. ఈ సందర్భంలో నా మనసులో కలిగిన భావనలను ఈక్రింది పద్యాలలో పొందు పరిచాను.

ముంగిలి కేగినంతనని మోదమునన్ చిఱునవ్వులొల్కుచు న్
సంగడి కాడునా బరగి స్వాగతమిచ్చి మదీయ పద్యకా
వ్యాంగన గూర్చి మంచి చెడు లారసి సందియముల్ దొలంగవే
భంగుల బోధ చేయు కవి 'పార్థివ' బాపుజి నేతలంచెదన్.

వ్రాసిన పద్య కావ్యముల బల్ రుచిరాన్యముగా తలంచున్
వేసరకెన్నడన్ చదివి వేసట శ్రద్ధగ తీర్చిదిద్ది, నా
బాసటయైన సన్నిహితు భవ్య కవిత్వ కళాతపస్విలౌ
భాసుర వంగపంతు కవి పండితునే తలతున్ కృతజ్ఞతన్.

నా "శ్రీనివాస కళ్యాణము"ను చదిని అమూల్యమైన సందేశ మునందజేసిన శ్రీ శేషగిరి సర్వేశ్వర కవులకు, వందన చందనము అర్పించుచున్నాను.

ఈ కావ్య ప్రచురణలో ఆర్థిక సహాయము చేసిన శ్రీ సజ్జా సుబ్బారావు, డివిజనల్ పంచాయితీ ఆఫీసరు, తెనాలికి మఱియు శ్రీ బాపూజీరావు, ఫిరంగిపురం పంచాయితీ కార్యనిర్వహణాధికారికి నా కృతజ్ఞతలు. పద్యములను ముద్రించి, పుస్తకమును అందముగా తయారుచేసిన శ్రీ ద్వారకా సాయి ప్రింటర్స్, ఏ.టి. అగ్రహారంవారికి నా కృతజ్ఞతలు.

రచయిత

కలువకొలను సూర్యనారాయణ

ఓం శ్రీ సాయిరాం

# ప్రార్థన

శరపా శాంకుశ శస్త్రహస్త విభవా! సందీప్త చంద్రాననా!
వరకాంచీ నగరస్థితా! విమలభాస్వత్తేజ! చిద్రూపిణీ!
కరికుంభస్తన భూరి భారనత సద్గాత్రీ! జగన్మోహినీ !
వరదా! త్వత్కరుణా కటాక్షయుత సద్వాక్కుల్
ప్రసాదింపుమా.

సప్తగిరీంద్ర సంస్థితుడు చక్రధరుండు త్రిపుండ్రశోభితో
ద్దీప్తముఖాంబుజుండసుర తేజ విదారుడు శ్రీసతీప్రియుం
డాప్తుడు శేషశాయి సకలార్త జనావన కారకుండు సం
ప్రాప్త భవాబ్ధి నిస్తరణ పండితు గొల్చెద కార్యసిద్ధికిన్.

# శ్రీనివాస కల్యాణము

శ్రీవత్సాంకిత కౌస్తుభాది మణులన్ జెల్వారు వక్షస్థలిన్
శ్రీ వైకుంఠ పురాధినాథు సతియౌ శ్రీలక్ష్మి కావాసమౌ
తావున్, మౌని భృగుండు క్రోధమున కాల్దన్నన్
ముకుందుండు, కో
పావేశంబులు జూపకుండు, మఱి తత్పాదాంబుజం బొత్తుచున్.

కని, మదిగలంగి, యవమానమును భరింప
నలవిగాక శ్రీసతి విభునచట వీడె;
సతినిబాసి శ్రీహరియును చాల పొగిలి
శోకతప్తుడై విరహాగ్నిసుక్కి మిగుల.

"ఎచ్చటి కేగినావో? తరళేక్షణ! నన్విడనాడి, నాపయిన్
రచ్చవహించితేల? యలుకా? మఱి యాగ్రహమా? యెఱుంగనీ
విచ్చటలేని మందిరము లేవనవాటిక లేవికుంఠమున్
నొచ్చగరాని కారడవి, శూన్యము" లంచును చాలవ్యగ్రుడై.

శ్రీసతిగూర్చి సత్వరిని శ్రీహరి స్వాంతమునందు కుందుచున్
వాసము వీడి క్షేత్రములు పల్లెలు సాంద్రవనాంతరంబులున్
వాసి గడించినట్టి ఘన పర్వతముల్ త్రిజగంబులందు నా
యాసముకోర్చి తావెదకె; యత్నములన్ని వృథాశ్రమంబుగా

లోకములన్నియున్ దిరిగి లోవ్యథజెంది జనార్దనుండు భూ
లోకముజేరి శాంతిగనె. లుప్తమనోవ్యథుడౌచు, నెట్టులో
శోకముపీడి, యాతజేని, శోభిలుసప్త గిరీంద్ర వాసియై
ప్రాకటనిష్ఠ యేర్పడ తపంబును బూనె కఠోర దీక్షతో.

అన్నము పానమున్ గొనక యచ్యుతుడట్లు తపంబుసేయగా
క్రన్నన వల్మికంబొకటి క్రమ్మెను దేహమునంత చుట్టుచున్
చెన్నునశించి గాత్రము కృశించె; మహేశ్వరుడున్ విరించి
యున్
కన్నులగాంచి తత్స్థితిని గాసిలి మానసమందు పెల్లుగన్.

ఆశన పానంబు లందింప హరికి, సిరిని
బిల్వ బంపిరి సూర్యుని వేగ, కాని
పతిని జూడగ రాదయ్యె పడతిలక్ష్మి
పట్టువలయందు పడతులె గట్టివారు.

జలజనాభుని రక్షింప జలజ భవుడు
వెలసె ధేనువై, వత్సమై వెలసె శివుడు
ఆదిలక్ష్మిని నర్థించి రంతవారు
చోళరాజ్యము జేర్పత్రి శుద్ధిగాను.

యాదవాంగనరూపాన యాది లక్ష్మి
చోళరాజుని సౌధంబు జొచ్చి విత్ర
యుంచె, రాణియు మూల్యంబు నిచ్చికొనియె
ముద్దులొల్కు గోవును వత్సమును గనుగొని

కాపరి కప్పగించె కృతకంబగు గోవును రాణి, యెట్టులో
కాపరి కన్నుగప్పియది గ్రాసము మేయుచున్నయట్లు యా
దాపున వాపునన్ దిరిగి దాగుచు మందనువిడి మాయమై
యేపుగ జేపియమ్మృతున కిచ్చుచునుండె దినంబు క్షీరమున్

వట్టిపోయిన పొదుగుతో పశువు మరల
మందజేరు. పాలుపిదుక మంకుజేయు
కతము తెలియ గోరినరాణి కబురు జేసి
పలికెనిట్లు కాపరితో కోపంబుగాను

కారణమేమి కాపరి? నిగారపుటావని కొంటినప్పు, డ
మ్మారదిపెట్టుచున్నదిపు డచ్చెరువయ్యె నదేమి చిత్రమో,
క్షీరము నీయకుండె మటికీలక మేమొ యెఱుంగ, గాన త
త్కారణ మేమొ నీవు విశదంబుగ నారయు"మంచుచెప్పెనన్

మరునటి దినంబు కాపరి మాటువేసి
వల్మీకంబు దరికి జేరి పాలనిచ్చు
మొదవునుఙ్గని, దండంబు బూనిచేత
గట్టిగావాడు దానిని గొట్టబోవ.

తలనొడ్డెన్ హరి, సర్వభూత హితుడున్, త్రైలోక్యపూజ్యుండు
లలితాకారుడు, సర్వలోకజన కల్యాణాభిలాషుండు, వ
త్సలతా పూర్ణమనస్కుఁడై, తనయునిన్ తద్ఘాత పాతార్తి క్రి
లల బారిన్ద్రోల గంగ జేయ, నిజశీర్షం బెంతయో వ్రయ్యగన్

అంతట మాయమై చనియె నాకృతకంబగుగోవు, వత్స, మ
త్యంత వ్యథార్తుడై తలను దాకిన గాయము మాన్పనెంచి శ్రీ
కాంతుడు మందుకోసమయి కాననమందు చరించుచుండ, త
త్ప్రాంత పుగొండయందలరు వాని మదారు వరాహమూర్తిన్

గాంచి, యమ్మహనీయు నర్థించె నెమ్మి
ఆశ్రయం బొసగు మనుచు నానగంబు
పైని. వల్లెయనుచు స్వామి పలికెనిటుల
తేనెలొలికెడి మాటల తెల్లముగను.

"నిన్ను పూజింప వచ్చిన నిఖిల జనము
ముందుగా ననుపూజించి మ్రొక్కునటుల
పరమొసంగు మా" యని నంతహరియు సమ్మ
తించి, యా కొండపై నుండి తిరుగుచుండె.

ఆనగ సీమపైని నడయాడుచు నున్న నవంతు నచ్యుతున్
మానిత శీలయౌ వకుళమాలిక జాలి వహించిదాసి, స
మ్మానము సేసి, సేవల శ్రమంబును దీర్చి నిజాశ్రమంబునన్
త్రాణము ప్రాణమున్ నిలిపి తా పరిపోషణ జేయుచుండెడిన్

ఒక్క దినంబునన్ జని పయోజదళాక్షుడు కోరి వేటకై
యక్కడ పర్వతావృత ఘనాటవులందు, జరించి, కాంచె కై
పెక్కియటన్ జరించెడు గజేంద్రుని, దానిని వెంబడించినన్
చిక్కక పారిపోయి, యది జేరగబోయె మనోజ్ఞవాటికన్.

కనిమెన్ కంజదళాక్షుడా వనమునన్ కల్యాణ బాలామణిన్
ఘనవక్షోజను, దీర్ఘ కుంతలను, ముక్తాహారశోభాయుతన్
వనితాలోక శిరోవిభూషణను, సౌభాగ్యప్రదన్, పూర్ణ చం
ద్రనిభాస్యన్, సితపద్మలోచనను, సాలంకారపద్మావతిన్.

సందడి మించి మన్మథుడు సాయకమున్ గురిపెట్టివేయ నా
సుందరిపైన. తచ్ఛరము చొప్పడ సూటిగ దాకె గుండె, నా
నందపు పొంగులో నవసియాయమ మూర్ఛిలె, సేదదీరి యా
సుందరునే కనుంగొనుచు చూపు మరల్చక మాటిమాటికిన్.

"ఎంతటి యందగాడె! మును పెన్నడు గాంచిన దానగాను నే
నింతటి యందగాని, మదినెంచిననున్ కరుణింపవచ్చె శ్రీ
కాంతుడటంచు నేననెద, కానిచో కంతు జయంతుడాది యా
త్యంత మనోహరాకృతుల దర్పమడంచెడు యందమెవ్వనే?

ఈతని బాహు బంధమున నిమ్ముగ నొక్క నిమేషమైన ప్రే
మాతిశయమ్ముచే నిమిడిహాయిగ నుండకపోతి నెచ్చెలీ!
నా తలవ్రాత నేమనుదు, నన్ గ్రహియించి వివాహమందునన్
శీతల దృష్టి చూచెడినొ? వేకొన కారడి పెట్టునో" యనున్

ప్రేమ పారవశ్యమున నారీతి పలుకు
రాకుమారిని నెచ్చెలుల్ క్రమ్మి, రమ్ము
రమ్మని కరము గొని మందిరమున జేర్చి
రంత, శ్రీహరి చేరె, నిజాశ్రమమ్ము.

నవనవ శోభల వెలిగెడి
భువన మనోహరు మనోజ్ఞమూర్తిన్ కనులా
ర, పకుళ మాలిక కనుగొని
పరించి పలికె మృదువుగ ప్రేముడితోడన్

"ఓయికుమార! నీవిపుడు యుక్తవయస్కుడవైతివయ్య, యా
ప్యాయము మీర పెంచితి, వివాహము జూడ మనంబుకల్గెనో
శ్రీయుత! నాయభీష్టమును శీఘ్రమెతీర్చి ననున్దరింపగా
జేయుము, కన్నులంగనిన స్త్రీత్వము సార్థకమౌ కదుంగడున్

తల్లి పలికిన పలుకుల నెల్లనాల
కించి శ్రీనివాసుడనియెనిట్లు "తొల్లి
ద్వాపరంబున నీకట్టివర మొసగితి
ఆవరమిపుడు సంప్రాప్తమగును నీకు.

అమ్మరో! చూడవమ్మ కనులార మదీయ మనోజ్ఞ పూర్వరూ
పమ్మును నీకొసంగితి నపారముదంబున జ్ఞాన చక్షువుల్
సమ్మదమందగాంచితె? నిజంబని నమ్మితె? యన్న నామె, ర
మ్యమ్మగు దివ్యలీలల మహత్వము గాంచుచు తన్మయంబు
నన్

"ధన్యతజెందె నా బ్రతుకు దైత్యకులాంతక! నిన్నుజూచి, సా
మాన్యుడవంచు నెంచితి, రమాపతివంచు నెఱుంగనైతి, నా
దైన్యము బాపినాడవుకదా! ప్రభు! నీదగు దర్శనంబు గా
కన్యము కోరునేమనము? అంతముజెందె భవంబు త్వత్కృపన్

అనుచు వకుళమాల అచ్యుతు నుతియించి
పూర్వరూపమునిక పోవజేసి
వర్తమానరూప వైభవమ్మును గోరె;
వల్లెయనుచు నిలిచివకుళ మ్రోల.

పలికెనిట్లు "అమ్మ! భర్తగా గోరుచు
నన్ను, తపముజేసెమున్ను వేద
వతియను నొకపడతి భక్తిమీర
అందమునకు నామె ఆటపట్టు.

ఘోరతపంబు నిష్ఠతో నకుంఠిత దీక్ష నొనర్చుచుండ, దు
ర్వార మదాంధుడా యసురరాజు, దశానను డష్టు, చైత్రయా
త్రారతి నేగుచున్ కనియె తత్ వికచాంబుజ లోచనన్; కడం
బారడి చెంతకేగి దరహాసము సల్పుచు పల్కెనిట్లులన్.

"ఎవ్వతెవీవు చాన? యిటు లింతటి ఘోరతపంబొనర్పగా
నెవ్విధి వ్రాసెనో నుదుట? ఏమి కతంబున జేసెదో కదా!
జవ్వనమందు సౌఖ్యముల సారము గ్రోల తపింతురెందు 'నీ
వివ్విధి జేయుటల్ తగునె? ఇవ్వనభూమిని, చాలు బాలికన్.

ఇంతటి యందమేను మును పెన్నడు గాననివాడ, దేవతా
కాంతవో! యక్షకామినివో! కంజదళాక్షి! వచించవేల? నీ
కాంతునిగా గ్రహించి కలకాలము స్వర్గసుఖమ్ములిమ్ము; నా
స్వాంతమునందు నిల్పితిని భద్రముగా భవదీయరూపమున్".

అనినన్ విని యాపడతియు
"వనమాలిన్ హరిని, నేను పతిగా బడయన్
పనివడి బూనితి తపమును
ననుగోరుట నీకిటు తగునా? యనిపలుకన్.

"ఎవరనుకొంటివి? నేను దనుజేంద్రుడ, లంకకధీశ్వరుండ, త్రి
భువనము, సర్వదిక్పతులు, భూతనికాయము నాదు నానసుం
ద్రమ, వలచివచ్చియుండిరి కుతూహలతన్ లలితాంగు లెందరో
సవినయ మొప్పవేడెద ప్రసన్నత జూడవె కన్యకామణీ"

"ఇన్నివిధంబులన్ పలుకనేను పచింపవు మాఱుమాట నా
విన్నపమున్ గ్రహింపవు వివేక విహీనవె? నాకురాణివై
మున్న కనంగరాని సుఖభోగములన్, పరిచర్యలంది నీ
చెన్నకు వన్నెబొందు" మని చెంతకు బోయి కరమ్ము పట్టి
నన్

కన్నుల విస్ఫులింగములు గ్రాలగ దిగ్గున లేచి యామె యా
పన్నత జెంది యిట్లులనె" పాపపు కోర్కెతొ దానవాధమా
నన్ను స్పృశించితీవు మలినమ్మయె నాదు శరీరమక్కటా!
ఎన్నగ దీనినిప్డు దహియింపగ జేయుదు నగ్నికీలలన్

పండె పాపమ్ముకొమ్మతలి, పెండి, నే, న
యోనిజనయి జననమంది యోగమహిమ
నీదు చావును చూచెద నిక్క" మనుచు
అగ్నిలోబడె నామె యుద్విగ్నయగుచు.

తండ్రియానతి తలదాల్చి ధర్మనిరతి
సీత తోడుత దీక్షతో చేసెడివన
వాసవేళ యసురరాజు మోసమునను
"పరమపావని" నపహరింపంగ రాగ.

అచ్చమౌ సీతదాచి స్వాహా విభుండు
వేదవతి నప్డు సీతగా వేగమార్చి
యుంచ, గొనిపోయె. నామెను పొంచియుండి
ఖరిర! సీత వచ్చెనటంచు భ్రాంతి పడుచు.

అంతట వానరాధిపు సహాయముతోడ మహార్ణవంబుపై
పంతమునన్ శ్రమించి కడు, వారధి కట్టితి, లంక కేగి, య
త్యంత పరాక్రమోద్ధతి, దశానను ద్రుంచి రణమ్మునందు నా
కాంతకు దీర్చినాడచెఱ; ప్రచ్చర శీల పరీక్ష కోరినన్.

అగ్నిజొచ్చెయామె యందఱి ముందఱ
అనలుడంత శాంతుడగుచు లీల
సీత నిర్వుర నొగి శీఘ్రంబుగా జూపి
తెలిపి విషయమెల్ల తెల్లముగను.

"ఓ రఘునందనా! యినకులోద్భవ, ధర్మనిధాన, భర్తగా
గోరిలతాంగి వేదవతి ఘోరతపంబొనరించె మున్ను పెం
పార గ్రహింపు మీమె" నన "నామె యభీష్టము నిశ్చయమ్ముగా
మీరు మఱొక్క జన్మమున: తీర్చుట ధర్మవిరుద్ధమిత్తరిన్.

ఏకపత్నీ వ్రతుడనగు నేను స్వీక
రింప నీమెను భార్యగా నింపుగాదు
పుట్టు నాకాశ రాజన్యు పట్టిగాను
పుడమి నపుడు చేకొనె" దంచు నుడివితేను.

"ఆనాటి వేదవతి యే
ఈనాడు వెలసి పుడమిని, ఋషిపతిఖలెన్
తానాకృతి గొనియొప్పెడి
నేనామెను పెండ్లియాడ నియమంబుండెన్.

కాన చనుదెంచు మిపుడె యాకాశరాజు
కడకు, విషయంబు వివరించి కన్యనడిగి
పెండ్లిజరిపించు మమ్మరో! వేడ్కమీర
వెలది పద్మావతితో శోభవెలయు నటుల

ఘనకేశపాశంబు నొనరంగ కొప్పుగా
ముడిపెట్టి తంగెడుపూలు పెట్టి
నెలబాలు సరియగు నెన్నుదుట బరగ
దిద్దిన కుంకుమ దీప్తి మెఱయ

జేగురు కమ్మలు చెవిపెట్టి, మెడనిండ
పూసల దండలు పొసగ దాల్చి
చింతపూవులరైక, చిలుక పచ్చని చీర
చెల్వారగా గట్టి చెఱగు దోపి

కడియములు కాళ్లకును మఱి కంకణమ్ము
కరముల కమర్చి, చేతతంబురయు, శిరము
పైని తాటాకు బుట్టను బాగునిలిపి
మంత్ర దండము బూని శ్రీమాధవుండు.

ఎఱుకసాని వేషంబు పొంపెసగ దాల్చి
రయమున నరుగుదెంచి నారాయణపుర
వీధులందు చరించుచు, వేయుచుండె
కేక, సోది పాడోయంచు కేరు మిగుల.

చెప్పెదనన్ని సంగతులు చిత్తములోగల భావమెల్ల సొం
పొప్ప గతించిపోయినవియున్ మఱిప్రస్తుతమున్, భవిష్యమున్
చొప్పడ చెప్పితిన్ మునుపు సోదె సురాసురు లెల్ల మెచ్చగా
నిప్పుడు వచ్చితీపురికి నేనని పెద్దగ కేకవేసినన్.

అంతిపురములో పవళించిపోయినున్న
రాణి చెవిసోకె నాకేక రమణిమిగుల
దాసిచే కబురంపి ముదంబుమీర
సోదెకత్తెను పిలిపించి సోదినడుగ.

"మున్నొకనాడు మీతనయ ఫుల్ల సరోజ దళాక్షి, భవ్యసం
పన్న, యశోనిధాన, విభవంబుగ పుష్పవనంబునందు న
త్యున్నతి నాటుపాటల మహోత్సుకతన్ విహరించుచుండగా
క్రన్నన వచ్చినట్టి శుభ గాత్రుని నచ్యుతుగాంచి నంతనే.

వలచెన్ వానిని సుందరాంగి నిలిపెన్ భద్రంబుగా దివ్య రూ
ప లసత్ విగ్రహమున్ మనంబుననను, భావంబందునన్ రేబవల్
తలచున్, నీరమునన్నమున్ గొనదు, చెంతం జేరరానీదు నె
చ్చెలులన్ మౌనముబూనె, మాటలుడిగెన్ చింతాకుల స్వాంతయై

కావున చానను విమలగాత్రిని సత్వరమా రమా మనో
భావజు నచ్యుతాఖ్యున కవశ్యము నిచ్చియు పెండ్లివేడుకన్
వావిరి సల్పుడమ్మ. సురవంద్యుని నల్లునిగా గ్రహించినన్
తావక జన్మధన్యమగు తత్పద వీక్షణ మోక్షమిచ్చెడిన్.

ఎఱుకల సానియేదో వచియించె నటంచు తలంపరాదు, నా
యెఱుక నిజంబు శ్రీహరియె నిమ్ముగ నిచ్చినవాక్కు పల్కితిన్
పరవశమంది నేనిటుల, వైశమ పెద్దల కార్యసాధనం
బరమరలేక సల్పుమీ యాపగ బంపుడు, మేలుమీరగున్.

శ్రవణపేయమౌ, యామాట రాణి చెవుల
సోక సంతోషమును పొంది, సోదెకత్తె
నుచిత రీతిని సత్కారమొనర జేసి
భర్తకావార్త వివరించి పరవశించె.

అమితోత్సాహపు నింపునన్ వకుళ లోకారాధ్య కల్యాణ కా
ర్యము సాధింప మనంబునన్ దలచి సద్యంబద్రితాపీడి, యు
త్తముడాకాశ నృపాలు సన్నిధికి మోదంబొప్ప నారాయణా
ఖ్యమునన్ భాసిలు పట్టణం బరిగె నవ్యాజాను రాగంబునన్.

రాజ దంపతులధి కాను రాగమునను
స్వాగతం బిచ్చియామెను సత్కరించి
ఆమె రాకకు కారణమడిగినంత
పలికె నిట్టుల తేనియలొలుకు నటుల.

వాసము శేషశైలము నివాస మనోజ్ఞము, భూరిభూజ పు
ష్పాసవపాన భృంగ నికరార్భట మంజులరాగ యుక్తమున్
భాసుర దివ్యతేజుడు శుభంకరు డాద్యుడు దేవదేవుడై
వాసినిగన్న శ్రీ విభుడు భవ్యయశోనిధి యాత్మజుండగున్.

వావిరి వియ్యమంద, దగ వచ్చితి నిప్పుడు మాన్యులార, ప
ద్మావతి నిచ్చి పెండిలి ముదంబుగ జేయుడు శ్రీనివాసుతో
దేవుడు నిర్ణయించినది, దేవతలందరు మెచ్చునట్టి యీ
పావన కార్యమున్ సలిపి పాలన జేయుడు నాదు కోరికన్.

తేనియ గ్రోలినట్లు, కదళీయని సార రసాల సారమున్
పానము జేసినట్లు, మధుపంబుల మంజుల నాదమట్లు సు
స్నానము జేసినట్లు కలశాంబుధి, కోయిలగానమట్లు గా
వీనుల విందొనర్చె పృథివీపతి తావకుశాస్త్ర వాక్కులున్.

ఎంతటి పుణ్యమో! కలిగె నింతటి భాగ్యము నేడు శ్రీవరుం
డంతటి దేవదేవుని దయామయు నల్లుని జేసికొంటయ
త్యంతముదావహంబగు నటంచు వచించియు, పెక్కుకానుకల్
యింతికి నిచ్చిపంపి పృథివీశ్వర దంపతులంత నొప్పుగన్.

తన్మయులైన దంపతులు దాతత బంధు జనంబులందఱున్
సన్మనులన్ వసిష్ఠుని భృశంబుగ బిల్వగ, వచ్చి, రంత రా
జన్మణి "లగ్నమొక్కటి విచారణ సల్పి త్వరన్ వచించుడో
సన్మతులార?" యన్న, ముని సత్తములొక్కటి నిర్ణయించినన్

లగ్నపత్రిక వ్రాయించి రాజు, యోగి
శుకునితో పంపె శ్రీనివాసునకు, దాని
స్వీకరించి వకుళమాల శ్రీనివాసు
లంత సంతోషమును పొందిరాత్మలోన.

"తావక వాంఛమేరె శుభదాయక! భూవరుడంపె లేఖ ప
ద్మావతినిచ్చి నీకు ఘనతన్ జరిపింపగ పెండ్లివేడుకల్
నేపది తెచ్చియిచ్చితిని నెమ్మమదీయ పురాకృతంబనన్!
దేవర నాథవంబు భవదీయకృపన్ దొలగెన్ దయానిధీ!"

అని వచించిన శుకునకు వసన గర్వ
ఢిచ్చి కానుకలు, వీడికోలిచ్చి గార
వంబుగా పంపె, నంత వివాహమునకు
శ్రీనివాసుడాయత్తమై శీఘ్రమునను

ఖగరాజున్ బిలిపించి "దేవగణమున్ గంధర్వయక్షాదులన్
జగతీనాథుల, బంధువర్గముల శిష్టాచార సంపన్నులౌ
నిగమాకారమునీంద్ర సంఘములన్ నీవీయెడన్ బోయి నా
దగు కల్యాణ నిమిత్తమై పిలువు మత్యంతాను రాగంబునన్"

అన-గరుడుడంత జవమున చనియె బిల్వ
వారినెల్ల శ్రీహరియు కుబేరు దరికి
నేగి ఋణముగా ధనమును వేగదెచ్చె,
"శ్రీనివాసుడేయర్థించె సిరిని నేడు."

అవమానంబు భరింపలేక, యెటకోనత్యుగ్ర కోపంబున్
భవు సాన్నిధ్యము వీడి యేగిన రమాతస్వీలలామంబు మా
ధవు కల్యాణ ముహూర్తమున్ విని వ్యథా తప్తాంతరంగంబు
సన్
పవతిన్నే సహియింపలేనను చు రోషార్తిన్ వడిన్ వచ్చినన్.

అనురాగమ్మున స్వాగతం బొసగి ప్రేమాలాప వాక్యంబులన్
దనరన్ బల్కుచు నంకసీమ పయినత్యంతానురక్తిన్ సుఖా
సనమున్ దానొనరంగ నేర్పరచి స్వాస్థ్యంబేర్పడన్ జేసి యం
త నయం బొప్పవచించె మున్నుగల వ్యత్తాంతంబు కంజాక్షికిన్

సుందరాకారు పల్కులు సోకి చెవుల
అలుక దీరిన శ్రీలక్ష్మియాననమున
చిరునగవు వెన్నెలలు తోచె, శీఘ్రగతిని
వనితలందరు గూడి శ్రీ వరున కపుడు.

నవనీతంబును మేనరాచి యటుపైనన్ గంధమున్ బూసి ప
ల్లవపాణుల్ వెసనల్గుపెట్టి యమితోల్లాసంబునన్ వేకువన్
నవలా వణ్యునకంత, మంగళకర స్నానంబు వన్నిలవై
భవమొప్పన్ జరిపించి, దువ్వెకురులన్ వైనంబు పెంపారగన్.

కస్తూరి తిలకంబు కనువిందు గావింప
నూర్ధ్వపుండ్రమ్ముల నునిచి నుదుట
నిగనిగ మెఱసెడి నెఱి చెక్కుటద్దంబు
కాటుక బొట్టుతో గ్రాలజేసి
మణిరత్న సంఘాత మండిత కాంచన
సరములు గళమున మెఱవ వేసి
ఘనతేజమునజేసి గండభాగంబు ల
లర, కర్ణముల కుండలములుపెట్టి

బాసికంబు నుదుట పదముల పారాణి
పాదుకలను తొడిగి పట్టువస్త్ర
ములు ధరింపజేయ, భువనమోహనుడొప్పె
పెండ్లికళల, చూడ వేడుకయ్యె.

గోజ్జంగినీటితో కొమరప్ప స్నానంబు
జరిపించి కేశపాశంబు తుడిచి
జడలల్లి విరిమాల సవరించి నుదుటిపై
తీరుగా కల్యాణ తిలకమద్ది
పట్టుపుట్టంబును గట్టించి తనరార
నత్తరు పన్నీరు నలదిమేన
తప్తకాంచన హారతతి కంబు కంఠాన
పదముల కడియాలు బరగబెట్టి

ముగ్ధ పద్మావతి నపుడు మోదమునను
అందచందాల రాశియై యలరుచుండ
పెండ్లికూతురుగ నొనర్చి పేరటాండ్రు
ప్రీతి గౌరిపూజను జరిపించి రపుడు.

రమణీయ రాజమార్గమ్ములు పన్నీర
జలములో చల్లించి చక్కజేసి
రంగురంగులను బరంగు క్రొంగ్రొత్త లా
ముగ్గులు పెట్టించి ముదముమీర
తేజమ్ము లీనుచు రాజిల్లు రత్నాల
తోరణాల్ కట్టించి తీరుగాను
సౌధాగ్రసీమల సౌజన్య సంకేత
ఛత్రములమరించి చిత్రముగను

అనఘుడాకాశ రాజుని యాజ్ఞకతన
భటులు సామంతులనుగూడి ప్రాభవముగ
బరగ నారాయణ పురమును రమణీయ
ముగ నొనర్చిరి దేవేంద్ర పురినిమించి.

బంగరు గద్దియన్ నిలిపి భాసుర రత్ననికాయ బంధురో
త్తుంగ విశాల శాలలను తోరణపంక్తుల తీర్చి దిద్ది వే
లంగుల, రత్నకంబళులు పైచి, సముంచిత చిత్ర చిత్రముల్
ముంగిటనుంచ రమ్యముగ, పూర్ణతనొందెను పెండ్లివేడుకల్

రాజ పురోహితున్ బనిచి రాజు రమావిభు బిల్వబంప నం
భోజ పత్రాయతాక్షుడు విభూతి దలర్ప సబాంధవంబుగా
రాజపురంబువచ్చె రతిరాజును బోలి, నృపాలుడంత స
త్పూజల స్వాగతంబొసగి తోడ్కొనివచ్చె సగౌరవంబుగన్.

అరవిందాక్షుని, పుత్రికామణిని, రత్నాలంకృతోద్దీప్త సుం
దర పీఠంబు పయిన్ సలక్షణముగా ధాత్రీశుడాసీనులన్
బరగన్ జేసి వివాహమున్ జరిపె సద్భావంబు పెంపారగా
సురగంధర్వులు యక్షకిన్నరులు వే, స్తోత్రంబు సేయన్ దివిన్

పుడమి పులకించె, దివియును మోదమందె,
అంబర పథమ్మునందున నమరవరుల
సరస సంగీత సుమధుర ఝరులు పొరలె
సిరియు, శ్రీనివాసుల పెండ్లిజరుగు తఱిని.

....: శుభం భూయాత్ :....